## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పాత పాటలు

వేటూరి మల్లా - కామేశ్వరరావు (బి. ఏ.,)
సేకరించినవి.



ఇండియా ప్రింటింగ్ వర్క్సు,
మదరాసు.
1930

# ఉపోద్ఘాతము

ఈ పాతపాటలు నా పెద్దకుమారుడగు టేకుమళ్ల కామేశ్వరరావు (బి. ఎ.,) కష్టపడి సేకరించినవి. అతనికి చాలకాలమునుండియు నిట్టిపాటలను, సామెతలను, కథలను, జాతీయములను (Idioms) కూర్చి యుంచుకొనుట యొక్క యభిమాన కార్యముగా నుండెను. ఈ పాతపాటలలో చాలవఱకు నాతల్లిగారి నోటనుండి వ్రాసికొనెను. కొన్నిటిని విజయనగరమునందును, మరికొన్నిటిని నెల్లూరునందును సంపాదించెను.

అతను సుమారు రెండువేలకంటె నెక్కుడుగా, తెలుగు సామెతలను, లోకోక్తులను సమకూర్చెను. ఇవిగాక ఆంధ్రజాతీయములు (Telugu Idioms) చాల ఉన్నవి. ఈజాతీయములు చాల[illegible]ముగ నుండును. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు, స్త్రీలు పురుషులు మున్నగువారు మాట్లాడుచున్నప్పుడు స్వభావసిద్ధముగాను, అనాలోచితముగాను వారి సంభాషణలయందు వాడుకచేయబడు ప్రత్యేక విలక్షణ ప్రయోగములు వీనియందు గాన్పించుచుండును. వీని నన్నిటిని సంధానించుటకతను చాలకాలము నిరాడంబరమైన పరిశ్రమ చేయవలసి వచ్చెను.

అతను సేకరించిన భాషావస్తు సముదాయములో పాతపాటలను మాత్రము ప్రస్తుతము పుస్తకరూపమున ముద్రించి ప్రకటించినాడు. ఇందలి జోలపాటలను ప్రచురించుటకు ముఖ్యకారణము లేవనిన—

(౧) శిశుపోషణచేయుడు తలిదండ్రులగు యువతీయువకులు తమ పిల్లల నోదార్చుటకును, ఉబుసుపుచ్చుటకును, నిద్దుర పెట్టుటకును, యీ జోలపాటలను పాడిన నెక్కుడు యుపయోగముగా నుండును.

(౨) ప్రస్తుతము ప్రాథమిక పాఠశాలలలో జదువుచున్న బాలురకును, బాలికలకును వాచకపుస్తకముల ననేకులు విద్యాధికులు వ్రాయుచున్నారు. అట్టి వాచక పుస్తకములలో శిశుతరగతి కుపయోగించెడు పాఠములు ముఖ్యముగా బాలగీతములు (Nursery Rhymes) రూపముగా నుండుట చాల మంచిదని అనుభవైక వేద్యమైన విషయము. కావున వాచకపుస్తకములను వ్రాసెడు యుపాధ్యాయు లీజోలపాటల నుండి వలసినవాని నేర్చి తీసికొనవచ్చును.

(3) ఆంధ్రజాతీయత సర్వతో ముఖముగా నభివృద్ధిబొందుటకు జనసామాన్యమందున్న యలేఖ్యపారంపర్యవిద్య (Traditional lore) నశింపకుండ జాగ్రత పెట్టవలసియున్నది.

పైన జెప్పిన కారణములచేత నిటువంటి పాతపాటలను బాలగీతాభిమానులు సంపాదించి ప్రచురింతురుగాక!

— శేకుమళ్ల అచ్యుతరావు, యం.ఏ., యల్. టి.

# పాత పాటలు - సంగ్రహతత్వము

ఈ పాతపాటలు స్త్రీపురుషులు పాడెడు విధముగానే వ్రాయబడినవి. కావుననే పదములకు లేనిపోని దీర్ఘములు హ్రస్వములు చేర్చబడియున్నవి. ఈరీతిగా నున్నను గాని వాటిని పాటలుగా పాడుకొనుటకు వీలులేదు. ఇప్పుడున్న రూపములో గ్రామ్యముకూడ మిశ్రమైయున్నది. పాడుకొనుటకు పనికిరావలెనన్న ఈ రూపే యుండవలెను.

ఈ పాటలయొక్క లక్షణము ద్విపద లక్షణమునకు సరిపోవుచున్నది. కొంతకొంత భిన్నముగా నున్నను మొత్తముమీద ద్విపద లక్షణమనియే చెప్పవచ్చును. సరియైన యతులు చాలమట్టునకు గలవు. ఈనియమము లక్కడక్కడ నష్టమగుటకు కారణములు : పాడెడు స్త్రీపురుషులు అజాగ్రత్తచే చేసిన మార్పులు, సహజముగా నట్టి నియమములు కుదురనిచోట బలవంతముగా జొప్పించనుండుటయు, ఈ పాటలు గ్రంథములపై లిఖింపబడినవి గాకుండుటయు. మనుష్యుల జ్ఞప్తియందే యున్నవగుట చేత నిట్టిభేదములకు మరింత అవకాశము కలదుగదా.

ఈపాటలయందు పూర్వకాలమందలి వ్యక్తిస్థితి, కుటుంబస్థితి, సంఘస్థితి, ఆచారములు, అలవాట్లు, దేశస్థితి, మొదలగునవి పెక్కు ప్రకటమగుచున్నవి.

వీటిలో కొన్నిటిభావమును తెలిసికొనుట కష్ట ముగానున్నది. అవి పుట్టిననాటికి నేటికిని గలిగిన భాషా విషయికమగు మార్పులే అందుకు ముఖ్యకారణము. కొన్నికొన్ని అర్థములేనిపాటలు (Nonsense Rhymes) కూడ కావచ్చునుం. ఈపాటలలో కొన్ని మిగుల ఆశ్చర్య కరముగను, రసవంతముగను ఉన్నవి.

ఈ పాతపాటలను కవనము చేసినవారెవరో మనకు తెలియదు. ముందైన తెలియుననునట్టి చిన్నెలు కానరావు. జోలపాటలను, పణతిపాటలను చేసినవారు స్త్రీలే యగుదురని అందలి శిశువిషయకమగు మృదుభావ ములవలన స్ఫురించుచున్నది.

ఈ పాటలను తొలుత 'భారతి' లో ప్రకటింప నవకాశమిచ్చిన భారతీపత్రికాధిపతులకు నేనెంతయు కృతజ్ఞుడను.

6-1-1930
చెన్నపురి.

వేకుమళ్ళ కామేశ్వర రావు.

# పాత పాటలు

## I. జోలపాటలు

౧

ఊ చక్క వూగదే వుయ్యాలచేరు
పా డక్క నిద్రపోదు పట్టి అబ్బాయి.

౨

విశాఖపట్నాన విసిరింది గాలి
వింజరపు రేవున్న తేలింది వాడ
వర్తకుడి పేరేమి వాడ పేరేమి
వాడంలో పోసిన్న దినుసు పేరేమి
వర్తకుడు అబ్బాయివాడ నా వాడ
వాడలోపోసిన్న దినుసు ముత్యాలు.

౩

ఇంతంత దీపమ్మ యిల్లెల్ల వెలుగు
ఈశ్వరుడి చందమామ జగతెల్ల వెలుగు
గోరంత దీపమ్మ కొండల్ల వెలుగు
గోపాలకృష్ణమ్మ మందల్ల వెలుగు

మాడంతదీపమ్ము మేడలకు వెలుగు
మారాజు అబ్బాయి మాకళ్ల వెలుగు.

౪

సూర్యుడు చంద్రుడు అన్నదమ్ముల్లు
సూటిగుఱ్ఱాలెక్కి జూదమాడేరు
అబ్బాయి తమ్ముడు అన్నదమ్ముల్లు
లక్కపావా లెక్కి లెక్క రాసేరు.

౫

ఏటిగటూమీద సంధ్యల్లు వార్చు
ఎఱన్ని చినవాడు ఎవరి అబ్బాయి
నాగగంధపు చెప్పులపోగు లున్నాయి
నా మేనఅల్లుడు రార అబ్బాయి!

౬

ఏటిగట్టూమీద కరివేపచెట్టు
గాలివానవచ్చి కొమ్మ లల్లాడె
కొమ్మలల్లాడెనే గొలుసు లల్లాడె
కొనికొన్ని ముత్యాలచేరు లల్లాడె
ఆచెట్లపైనుండి అబ్బాయిరాగ
బంగారుతలపాగ చెంగు లల్లాడె.

౭

ఏవాడ వెళ్లేవు నీవు అబ్బాయి
ఎవ్వారు కట్టేరు మువ్వల్లుకాళ్ల

కలవారిపట్టాని గారాములాని
కంచారి కట్టెడె కంచుమువ్వాల్లు
తనతోడి పట్టాని తనకు ముద్దాని
అన్నయ్య కట్టెడె వెండిమువ్వాల్లు.

౨

చిన్నాడు పువ్వేరుపు చిలకము క్కెరుపు
చిగురెరుపు చింతల్ల దోరపం డెరుపు
రక్కసపం డెరుపు రాగిచెం బెరుపు
రాచవారిళ్లలో మాణిక్య మెరుపు
తామెరుపు అమ్మాయి తెనవారిలోన.

౩

ఏనుగు మెక్కెర్యో ఓరాజురాగ
ఏకదివాణమ్ము మెవరి లోగిలి
పల్లకి ఎక్కెర్యో ఓరాజు రాగ
బంగారు తలుపుల్ది మెవరి లోగిలి
అందలా లెక్కెర్యో ఓరాజు రాగ
అద్దాలతలుపుల్ది మెవరి లోగిలి
ఏనుగ మెక్కెర్యో అబ్బాయిరాగ
ఏకదివాణమ్ము వదినె లోగిలి
పల్లకీమెక్కెర్యో అబ్బాయిరాగ
బంగారుతలుపుల్ది వదినె లోగిలి

అందలా లెక్కెయ్యే అబ్బాయిరాగ
అద్దాలతలుపుల్ది వదినె లోగిలి.

౧౦

గంధమ్ము తీసిన్న సాన చల్లన్న
సభలోన అబ్బాయిమాట చల్లన్న
ఇందూవ తీసిన్న నీళ్లు చల్లన్న
ఇంట్లోన అమ్మాయి కడుపు చల్లన్న

౧౧

గోపాలకృష్ణమ్మ పెళ్లియ్యేనాడు
గోరింట పూచింది కొమ్మలేకుండ
మాయింటి అబ్బాయి పెళ్లియ్యేనాడు
మల్లెలు పూచేయి మొగ్గలేకుండ.

౧౨

ఉయ్యాలలో బాల వుగ్గు కేడిస్తే
ఉత్తమా యేశోద వూచి వుగ్గోయ్యి
పల్లకీలో బాల పాలకేడుస్తే
బలభద్ర మాలక్ష్మి పాడి పాలొయ్యి
ఏటికీ కాలూవ యెంతదూరమ్ము
యెత్తిపెంచినతల్లి కెంత మోహమ్ము
కాలువ నీళ్లన్ని కడుసముద్ర మాయె
కడలేని మోహమే కన్నతల్లికి.

౧౩

ఊరిక్కి ఉద్యోగరాజు వచ్చేడు
విడిమట్లు చూపండి విందు నాయిల్లు
ఊరిక్కి ఉద్యోగరాజు అబ్బాయి
విడిమట్లు నీయిల్లు విందు నాయిల్లు.

౧౪

ఆటల్లు పాటల్లు అత్తవారింట
అతి రాచచిటిబిపనులు అమ్మగారింట.

౧౫

తోటాకూరా చెట్టెయ్యవలెను
దొగ్గలి పెరిగింది దొడ్డిముందార
రాచాయింటా కన్నెయ్యవలెను
అబ్బాయియింటికే వచ్చింది కన్నె.

౧౬

చిక్కుడాకూమీద చిలక వాలింది
చిల కెక్కి ఓరాజు చిక్కివున్నాడు
అరిటాకూమీద హంస వాలింది
హం సెక్కి ఓరాజు అమిరివున్నాడు
కొబ్బరాకూమీద గోర వాలింది
గో రెక్కి ఓరాజు కోరివున్నాడు
మామిడాకూమీద మంచు వాలింది
మం చెక్కి ఓరాజు పొంచివున్నాడు

గుమ్మడాకూమీద గువ్వ వాలింది
గువ్వెక్కి ఓరాజు గూతొగ్గినాడు
చిక్కుడాకూమీద చిలుకఅబ్బాయి
చిలకెక్కి అమ్మాయి చిక్కివున్నాది
అరిటాకూమీద హంసఅబ్బాయి
హంసెక్కి అమ్మాయి అమిరివున్నాది
కొబ్బరాకూమీద గోర అబ్బాయి
గోరెక్కి అమ్మాయి కోరివున్నాది
మామిడాకూ మీద మంచు అబ్బాయి
మంచెక్కి అమ్మాయి పొంచివున్నాది
గుమ్మడాకూమీద గువ్వ అబ్బాయి
గువ్వెక్కి అమ్మాయి గూ తొగ్గినాది.

౧౨

వేసంగికాలాన ఓ పెళ్లికొడకా,
వేపతోరణాల నీడనే రమ్మి
మాయింటి అబ్బాయి పెళ్ళయ్యేనాడు
మామిడితోరణాలు మరి దూరిరమ్మి.

౧౩

దేవుడీగుళ్లోను దేవు డాడేని
దేవేంద్రసభలోన జూద మాడేని
పరమేశ్వరుడు గుళ్లోను పాము లాడేని
పణతి నా నట్టింట బాల లాడేని.

౧౯

పిల్లి పిల్లి పిల్లి పిల్లలకుతల్లీ
పల్లేరుముళ్లలో పాలిచ్చిపోవె
పిల్లలికి పాలోసి పల్లెలకు బంపి
అబ్బాయికి పాలోసి ఆడుకో బంపు.

౨౦

వీధి నెందరు వున్న విసర దేగాలి
రచ్చ నెందరువున్న రాదమ్మ వాన
నా చిన్న అబ్బాయి వీధి నిలుచుంటే
మొగలిపువ్వులగాలి ముత్యాలవాన.

౨౧

చిలక లాడేనమ్మ హంస లాడేని
పావురా లాడేని పందిళ్లలోన
చిలక నాఅబ్బాయి హంస అమ్మాయి
పావురం కుఱ్ఱవాడు పందిళ్లలోన.

౨౨

పిల్లెమ్మకన్నుల్లు బీరపువ్వుల్లు
అబ్బాయికన్నులు కలువ రేకుల్లు
కలువ రేకులవంటి నీ కన్నులాకు
కాటుకలు పెట్టితే నీకు అందమ్ము.

౨౩

ఏడవకు ఏడవకు వెఱ్ఱినాతండ్రి
ఏడిస్తే నీకళ్ల నీరు కారేని
నీళ్లూను కారితే నేచూడలేను
పాలైనకారవే బంగారుకళ్ల.

౨౪

చింతచెట్టుకింద చిటిబొమ్మరిళ్ళు
వాటికీ వాకిళ్ళు బోరుతలుపుల్లు
బోరుతలుపులకింద పొందైనమేడ
ఆమేడనున్నాయి యిద్దరుహంసల్లు—ఆమెడ.
ఆయిద్దరు హంసల్ల పేరేమిపేరు—ఆ యిద్దరు.
రాచిలకఅబ్బాయి రంభఅమ్మాయి-రాచిలక.
ఛిలకలకు చెలికాడు తానుఅబ్బాయి-చిలకలకు.
హంసలకు చెలికత్తె తాను అమ్మాయి.

౨౫

అబ్బాయిమామల్లు యెటువంటివారు
చెవికిచెవికి బారెడేసి పోగుల్లవారు—చెవికి.
అంచుపంచెలవారు అంగీలవారు-—అంచు.
పట్టుపంచెలవారు పాగాలవారు—పట్టు.
పెసరకాయలవంటి పెదిమెల్లవారు—పెసర.
కందికాయలవంటి కనుబొమలవారు—కంది.
మిరపకాయలవంటి మీసాలవారు—మిరప.
వారు మా అబ్బాయి మేనమామల్లు.

౨౬

తామలపాకులమీద లేకల్లువ్రాసి
తమ్ము డంపినాడె తనముద్దుమాట
తనముద్దుమా టొకటి దబ్బపండొకటి
"నాచిన్నతమ్ముడు రార అబ్బాయి."

౨౭

గోరింటపువ్వువంటి కొడుకు నెత్తుకొని
బాలింత వచ్చింది బావినీళ్లకు—
ఏదేది బాలింత ఎంత చక్కందో
మా చిన్ని పట్టుచీర మణవలకు పసుపు
కళ్ళదీ కాటుక పళ్ళదీ మెరుపు
మావాడ బాలింత అబ్బాయితల్లి.

౨౮

తూర్పున్న అబ్బాయి యిల్లుకట్టేను
దూలాలుమోసేరు దూదిపరుపుల్లు
పడమటను అబ్బాయి యిల్లుకట్టేడు
పట్టెల్లు మోసేరు పాలకావిళ్ళు
దక్షిణాన్న అబ్బాయి యిల్లుకట్టేను
దండెల్లు మోసేరు ధనముపెట్టెల్లు
ఉత్తరాన అబ్బాయి యిల్లుకట్టేడు.

. . .          . . .          . . .

౨౯

తాతల్లు గట్టిన్న ధర్మశాలల్లు
అవ్వల్లు అలికిన అరుగుల్లమీద
ముత్తవ్వలు పెట్టిన ముగ్గుల్లమీద
కూచోర అబ్బాయి కుదిమట్టుగాను——కూ.
ఊచవే అమ్మాయి వుయ్యాలచేరు——ఊచవే.
పాడవే అమ్మాయి బలగమందర్ని——పాడవే.
ధరణిచే రట్టుకొని తనవార్ని పాడె——ధరణి.
భూమిచేరట్టుకొని పుత్రుణ్ణి పాడె.

౩౦

ఊరిముందర డేర లెవ్వరివి
ఉత్తమా బిరుదుల్ల రా జెవ్వరమ్మ
ఊరిముందర డేరల్లుమావి
ఉత్తమా బిరుదుల్ల రాజు అబ్బాయి.

౩౧

ఆయిఆయిఆయి ఆపదలుగాయి
చిన్నవాళ్ళనుకాయి శ్రీవెంకటేశ
గాయిగాయిగాయి ఏదమ్మగాయి
అంగళ్ల ఆడేటి అబ్బాయిని గాయి
పోలేరమ్మా పొత్తుళ్ళగాయి
పొత్తుల్ల నాడేటి అబ్బాయి గాయి.

౩౨

చిన్నారిపాచికలు మూవిలోగిళ్లు
చిన్నబాలా ఆడు చినబాలలతోడి
బంగారు పాచికలు నూవిలోగిళ్ళు
బాలలాడేరు మా అబ్బాయి తోడి.

౩౩

కోటంత దేవుడికి మేటంతపత్రి
బ్రహ్మంత ఆయుస్సు నీకు నా బాబు.

౩౪

జోలల్లుపాడితే జొన్నల్లుపండు
జోలలకు జొనబువ్వ నీకు వరిబువ్వ
ఏడ్చేటి అబ్బాయికి యెట్టావుపాలు
నాచిన్న అబ్బాయికి నల్లావుపాలు.

౩౫

అబ్బని కొట్టినకొట్టు వూరెల్ల రట్టు
తేరె మా అబ్బాయికి ముత్యాలబొట్టు
ముత్యాలబొట్టుకీ మూడు రేకల్లు
రత్నాలబొట్టుకీ రావిరేకల్లు
వజ్రాలుస్థాపించినవారి మామల్లు
మాణిక్యాలు సాపించిన వారి బాబుల్లు.

౩౬

అబ్బినికొట్టినకొట్టు వూరెల్ల రట్టు
తేరె మా అబ్బాయికి తేనెగాజుల్లు
ముత్యాలబొట్టెట్టి పట్టుచీరగట్టి
ముద్దువచ్చింది మా అబ్బాయిమోము—ముద్దు.
అద్దమైతోచింది వద్దిమామలకు—అద్దమై.
మేలిమై తోచింది మేనమామలకు—మేలి.
మేనమామలముద్దు మేలిమిన్నముద్దు—మేన.
తాతలకు తనచిట్టి అబ్బాయిముద్దు

౩౭

చిట్టి నాఅబ్బాయి చిరుమొగము చూచి
సిగ్గుపడి చంద్రుడు పొడవజాలాడు.

౩౮

ముద్దుల్లు ముద్దుల్లు ముచ్చికాయల్లు
అమ్మాయి ముద్దుల్లు గచ్చకాయల్లు.

---

# II. ఆటపాటలు

౩౯

గుడుగుడుగుంచం గుండారాగం
పాములపట్నం పడగారాగం
అత్తారిచెవులో ముత్యాలేస్తే
బయటికి రావే సందకొక్కా.

౪౦

కొంగకొంగ గోళ్ళు
రంగడిచేతి రాళ్ళు
నాచేతి పూలు.

౪౧

ఏనుగమ్మా ఏనుగు
ఏవూరెళ్ళిం దేనుగు
మావూరొచ్చిం దేనుగు
మంచినీళ్ళు తాగిం దేనుగు.

... ... ...

౪౨

చెమ్మచెక్క చారడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గు లెయ్యంగ
రత్నాలచెమ్మచెక్క రంగు లెయ్యంగ.

౮ త్తై

బావాబావా పన్నీరు
బావను పట్టుక తన్నేరు
వీధివీధి తిప్పేరు
వీసెడు గుద్దులు గుద్దేరు
పట్టెమంచం వేసేరు
పాతికగుద్దులు గుద్దేరు
నులకమంచం వేసేరు
నూరుగుద్దులు గుద్దేరు.

# III. పణతి పాటలు

౪౪

చుట్టు చక్కందమ్మ చక్కిలపుచుట్టు
చూలింత చక్కంది ఓరాచదేవి!
పండు చక్కందమ్మ పనసయ్యపండు
బాలింత చక్కంది ఓరాచదేవి!
ఆకు చక్కందమ్మ తామల్లపాకు
అయిదువ చక్కంది ఓరాచదేవి?
కొమ్మ చక్కందమ్మ గోరింటకొమ్మ
కొమరాలు చక్కంది ఓరాచదేవి!
పోక చక్కందమ్మ బొబ్బిల్లి పోక
బోగపుది చక్కంది ఓరాచదేవి!

౪౫

ఓయిఓయిఓయి ఓకాపు పిల్ల!
తాటిమేకచల్ల తాగడే గొల్ల
నిన్న మొన్నటిచల్ల నేటికి పుల్ల
కవ్వాన్ని తిప్పింది కమ్మని చల్ల.

౪౬

చిలకల్లు చిలకల్లు అందురే కాని
చిలకలకు రూపేమి పలుకులే కాని
హంసల్లు హంసల్లు అందురే కాని
హంసలకు రూపేమి ఆటలే కాని

పార్వాలు పార్వాలు అందురే కాని
పార్వాలకు రూపేమి పాటలే కాని
కోయిల్లు కోయిల్లు అందురే కాని
కోయిలకు రూపేమి ఘోషలే కాని
చిలుకల్లు మాయింటి చిన్నకోడల్లు
హంసల్లు మాయింటి ఆడపడుచుల్లు
పార్వాలు మాయింటి బాలపాపల్లు
కోయిల్లు మాయింటి కొత్తకోడళ్లు

౪౭

వండా రారమ్మ వడక వంటల్లు
వల్లభుడు అబ్బాయికి వడుగు మాయింట
కట్టా రారమ్మ కలవతోరణాలు
కాముడి అబ్బాయి కళ్యాణ మాసీ
పెట్టా రారమ్మ పెళ్లి.ముగ్గుల్లు
పెంపుడు అబ్బాయికి పెళ్లి మాయింట
తియ్యా రారమ్మ చిప్పగంధాలు
శ్రీలక్ష్మి అమ్మాయికి సీమంత మనిరి
పుయ్యా రారమ్మ పురిటిగోడల్లు
పుణ్యశాలి సీతమ్మకి పురుడు మాయింట.

౪౮

చింతచెట్టుకింద చికిలింతగడ్డి
మెయ్యేదుగ మా ఆవు పెయ్యల్లు కానీ

ఆవుపాలు తెచ్చి పరమాన్నం వండి
కుడువదుగ మాఅమ్మ కూతుళ్ళకానీ.

౪౬

సిలాటిరేవంత నిగ్గుతేలింది
ఏచేడే కడిగింది యీచాయపసుపు
పచ్చిపసుపు బావల్ల మరద లాడింది
అణుప్పసుపు అన్నల్లచెల్లె లాడింది
కొట్లుపసుపు కోమాళ్ళ తల్లి యాడింది
కోమాళ్ళ తల్లియే తాను గోపమ్మ
గొంతియాడిన పసుపు గోవపూఛాయ
అన్నల్ల చెల్లెలే తాను అమ్మాయి
అతివె ఆడినపసుపు ఆవపూ చాయ
బావల్ల మరదలే తాను అమ్మాయి
పణాతి ఆడినపసుపు బంగారుచాయ.



# IV. ప్రకీర్ణములు

౫౦

దంపుదంపనగానె దంపెంత సేపు
ధాన్యరాసులమీద చెయి వేసినట్లు
వంటవంటనగానె వంటెంత సేపు
వదినెళ్ళుమరదళ్ళు వాదించినట్లు.

౫౧

అత్తపోసినగంజి సత్తావలేదు
అల్లూడు సిరిపురపు గట్టెక్కలేదు.

౫౨

కోటీవేలా ధనమైన చాలు
గోపికృష్ణుడివంటి కొడుకైన చాలు
లక్షావేలా ధనమైన చాలు
లక్ష్మణదేవరవంటి తమ్ముడైన చాలు.

౫౩

విశాఖపట్నాన వీథిగుమ్మాన
వింతరాచకొడుకు బంతులాడేడు
బంతి వెళ్లి పాలకొండసభలోన పడితే
యిది యెవరిబంతనీ వివరించె రాజు
గోలకొండవారిదే గొలుసుల్ల బంతి
పాలకొండవారిదే పచ్చల్ల బంతి

శ్రీకాకుళమువారిదే చిత్రాల బంతి
నెల్లూరివారిదే నీటైన బంతి
బొబ్బిల్లివారిదే బంగారుబంతి.

౫౪

ఓయిఓయిఓయి వడ్డాదిరాజ
పోడిచి గెలిచినరాజ బొబ్బిల్లిరాజ
బొబ్బిల్లి పోడుగాయె కిమిడి కిందాయె
మాడుగులు మనకాయె మళ్లుమీా రాజా.

౫౫

సరసన్న పేటలో భాగోతులాట
రాజు కూర్చున్నది రత్నాలపీట
పీటకిందున్నది వరహాలమూట
ఆమూట మాకిస్తె మామంచిమాట.

౫౬

కొయ్యతోటకూర కొయ్యకా చెడెను
కొండంతకాపురం కొండేల చెడెను.

౫౭

చిన్నమ్మ చినగాలి పెద్దమ్మ పెనుగాలి
అయోధ్యవీధుల్లో అణిగనే గాలి.

౫౮

చలికి వెరిచినట్టు పులికి నే వెరువ
ఆలికి వెరిచినట్టు అమ్మకీ వెరువ.

౫౯

పాటల్లొ పచ్చడి రాగాలబుఱ్ఱ
నిత్తైకమ్యేలమూరి మొగుణ్ణి పాడించి.

౬౦

కొడుకుల కనినవాళ్ళు కడుపేమి కడుపు
కులముద్ధరించనీ కొడు కేమి కొడుకు.

౬౧

పిడికెడు విత్తనాలు మడికెల్ల జాలు
వక్కడే కొడుకైన వంశానజాలు.

౬౨

కొత్తచింతాపండు గోనెల్ల చివురు,
గొడ్రాలివస్త్రాలు పెట్టెల్ల చివురు
దేవదారుచెక్క చెట్లున్న చివురు
దేవుడివస్త్రాలు గుళ్లోనుచివురు
రావిచెట్టు చెక్క రంపాన చివురు
రంభచక్కదనము దుఃఖాన చివురు.

౬౩

నాచేతిగోకళ్లు నల్లగోకళ్లు
నే పాడిన అన్నల్లు రామలక్ష్మణులు

రామలక్ష్మణులార రఘుపతులార
మీ రెక్క గుఱ్ఱాలు నీలమేఘాలు
మీచేతికత్తూలు చంద్రాయుధాలు

... ... ...

౬౪

ఎవ్వారే చుట్టాలు యెవరు పక్కాలు
ఎవ్వారే మాపాల కలిగియున్నారు
మాపాల శ్రీవేంకటప్ప వుండగను
మనసులో చింతేల మరిభయములేల.

౬౫

సింహాద్రి అప్పన్న గుళ్ళముందార
ఒడ్డారె గోడ్రాళ్ళు ప్రాణచారమ్మ
ఎందూకు పడ్డారు యేలపడ్డారు
సంతానమియ్యామని చాలపడ్డారు-సంతాన.
బిడ్డల నియ్యామని ప్రియముపడ్డారు - బిడ్డల.
కొమాళ్ళ నియ్యామని కోరిపడ్డారు - కొమాళ్ళ.
సింహాద్రి అప్పన్న కేమి లంచమ్మ
గుడిదిరుగువస్త్రీము గుమ్మాడిపండు
దాగళ్ళవడపప్పు చండుబెల్లాలు.

---

THE INDIA PRINTING WORKS, MADRAS.